'సదసద్రూపయా' అనుపదము గద్దు. ఇది 'మాయయా' అను దానికి విశేషణము. దీనికర్థమును శ్రీధరుఁడు 'కార్యకారణాత్మికయా' అని చెప్పినాఁడు. కార్యకారణములు రెండును మాయయే యని తాత్పర్యము. పోతన్నగారిచట భేదించి 'కలుగుచు లేకుండుచు', నని యర్థము తీసినారు. ఇది రామానుజుల సంప్రదాయమునకుఁ గొంతదగ్గరగానున్నది. మిథ్యయనఁగా 'మిథ్యాత్వంనామ ప్రతీయమానత్వపూర్వక యథావస్థిత వస్తుజ్ఞాన నివర్త్యత్వం' అని శ్రీభాష్యము. వారు శ్రీభాష్యమును గూడఁ జూచి యుండిరేమో! 'విజ్ఞానేన విజృంభితః' అని మూలము. 'విజ్ఞాన విజృంభితుండై' అని తెలుఁగులోని కల్లే వచ్చినది. అగ్నియొక్కరుం .... .... .... అంతర్యామి రూపంబున దీపించు=అగ్నియొకఁడే యయ్యును పెక్కుచెట్లు కంటుకొన్నప్పు డనేకములైన యగ్నులుగా భాసించును. పైఁగా వానికి దైర్ఘ్యవక్రత్వాదులు అగ్నిగుణములైనట్లే గన్పడును. కాని, వాస్తవమునకు వహ్నికాగుణములతో సంబంధము లేదుగదా! అట్లే అంతర్యామియైన పురుషునకు జీవునిగుణములతో సంబంధము లేదు. ఉన్నట్లు భాసించునంతే. 'విశ్వాత్మా' అనునది మూలములోని పదమే. ఇంతకముందు అనుప్రవేశనియమన లక్షణమైన లీలను వివరించినాఁడు. దీనితో బహురూపత్వలీలను జెప్పినట్లైనది. అంతర్యామి యొక్కఁడేయైనను జీవుల భిన్నత ననుసరించి నానారీతులైనట్లు గన్పించును. మహాభూత .... .... .... నూతుండిట్లునియె=ఈ క్రింది భోగ లీలను వివరించుచున్నాఁడు. భూతసూక్ష్మములు, ఇంద్రియములు, వీనితోఁగూడి గుణమయములైన భావములతో భూతములయందుఁ దగులువడక తద్గుణము లనుభవించు నన్నమాట. 'స్వయంనిర్మితేషు భూతేషు' ఇదియే 'తనచేత నిర్మితంబులైన భూతంబులందు' అని యైనది. భూతంబులందుఁ దగులువడక అనునది అర్థవివరణార్థము పోతన్నగారి చేర్పు. అంతరాత్మగాఁ బరమాత్మ అందరియందున్నను

వారి యహంకార మమకారములతో నాతనికి సంబంధము లేదు. ఎందుకనఁగా నాతఁడు సతతవిజ్ఞాన విజృంభితుఁడు. తద్గుణము లనుభవించు చున్నఁగా విషయాశ్రితములైన సుఖదుఃఖాదులను గాదు. కేవల ఘనస్వరూపమేయైన యానందాంశములనే యనుభవించును. ఆనందమాతని స్వరూపమేగనుక బాధలేదు. మూలమందు 'భుంక్తే' అనియున్నది. దీనికి శ్రీధరుఁడు రెండర్థములు చెప్పినాఁడు. 'అనుభవించు' 'అనుభవింపఁజేయుచు' నని. పోతన్నగారు మొదటియర్థమునే స్వీకరించిరి. నిరంతరజ్ఞాన రూపుఁడైన పరమాత్ముఁడు భోగముల ననుభవించుట పొసఁగదని మొదటియర్థమునం దస్వారస్యముండుటచే రెండవయర్థమును శ్రీధరుఁడు చెప్పెనని వంశీధరుఁడన్నాఁడు. ఈ సందేహము పోతనగారికిని గలుగక పోలేదు. 'భూతంబులందుఁ దగులువడక' అని యాసంశయమును నివృత్తిఁ జేసికొన్నారు. లోకకర్తయైన పరమాత్ముఁడు దేవతిర్యఙ్మనుష్యాదులందు లీలగా నవతరించి లోకముల రక్షించుచుండునని యర్థము. దేవాదులం దాతని యవతారము కేవల లీలమాత్రమే. ప్రారబ్ధము ననుసరించి గాదు. లోకభావనః=అనుటకుఁ దెన్గు 'లోకకర్త' యనుట. ఇది శ్రీధరీయమే. ఈ విషయములు చెప్పి మఱియు సూతుఁ డిట్లారంభించినాఁడు.

పుట్టపర్తి నారాయణాచార్యదానునిచే విరచింపఁబడిన
'భాగవతసుధాలహరి' యందు ప్రథమ
స్కంధము ప్రథమాధ్యాయ ద్వితీయా
ధ్యాయముల వ్యాఖ్య
ముగిసినది.



శ్రీపద్మావతి అమ్మవారు

